Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] మద్రాసు : 1942 వ సం|| జనవరి నెల 16 వ తేది శుక్రవారం [నె 2 రు

## మదరాసు గవర్నరుగారి రేడియో ప్రసంగము.

1942 వ సం|| జనవరి 13 వ తేది సాయంకాలం మదరాసు గవర్నరు, ఘనతవహించిన సర్ ఆర్థర్ హోప్ గారు మదరాసు ఆల్ ఇండియా రేడియో స్టేషనునుండి "మదరాసునకు ఎంతవరకు ఆపదరావచ్చునో" అనువిషయాన్నిగూర్చి మాట్లాడుచు, దాడిసంభవించేయెడల ప్రజలు ఏంచేయాలో యీ క్రింద చెప్పారు:—

"మదరాసు పౌరులారా:—జపాను మన శత్రువుల పక్షాన్ని చేరి యుద్ధంలో ప్రవేశించి మలయాలో మొదట్లో గెలుపొందటంచేత మదరాసునకు ఎంతవరకు ఆపదరావచ్చునో అను విషయాన్నిగూర్చి యీ సాయంకాలం మీతో మాట్లాడ దలచుకొన్నాను. నావికా బలంతోగాని సైనిక బలంతోగాని జపానువారు ఇండియామీద నిజంగా దండెత్తేభయం యిప్పుడులేదని మీకు నొక్కి చెప్పుచున్నాను. సింగపూరు బ్రిటిషువారి చేతులలోనున్నంత కాలం అట్టి దండయాత్ర ప్రశ్నయే రాజాలదు. అక్కడనున్న బలమేగాక యింకను సైన్యాలు అక్కడికి చేరుచున్నవి. మిత్రరాజ్యాలు జపానువారిమీదకు విజృంభించే సమయం వచ్చినప్పుడు యివి సాయపడగలవు. ఆ సమయము అచిరకాలంలో రాగలదు. రంగంమీద యిటీవల జరిగినదాడులవంటి జపానువారి విమానదాడులు విరివిగా జరిగే అపాయం మదరాసుకు యింత త్వరలో కలుగజాలదని నేను నొక్కి చెప్పుచున్నాను. రంగం, థాయిలాండు సరిహద్దుకు షుమారు 120 మైళ్ల దూరంగానున్న బాంకాక్‌నకు 400 మైళ్ళ దూరంగానున్న ఉన్నది. థాయిలాండులోని అత్యంత సమీప ప్రదేశంనుండి మదరాసు 1,300 మైళ్ళ దూరంలోనున్నది. కాబట్టి భూమిమీదనుండి బయలుదేరి బాంబులువేశే జపానువారి విమానాలు యిక్కడికి రాజాలవు. అవి మదరాసుమీద దాడి జరుపుటకు వచ్చేయెడల, చాలినంత పెట్రోలు వాటిలోనుండజాలని కారణంచేత అవి తిరిగి వాటి స్వస్థానం చేరజాలవు. గత యుద్ధంలో ఎండెన్ వలె జపానువారి ఏ యుద్ధపు ఓడయైన బంగాళాఖాతములోకి తప్పించుకొని వచ్చి మదరాసుమీదకు కొన్ని గుండ్లను వేయవచ్చును, లేదా ఒకటి రెండు విమానాలను పంపితే అవి బాంబులు వేయవచ్చును. అప్పుడు హెచ్చరిక చేయబడును. అందరు రక్షణ స్థానాలలో దాక్కొనే యెడల, ఎవరికిని దెబ్బ తగలజాలదు. కాబట్టి ఎవరును భయపడ్డానికిగాని మదరాసులో పని ఉండి కూడ దాన్ని విడిచిపెట్టి పారిపోడానికిగాని ఎంతమాత్రం అవసరంలేదు. ప్రతిదేశభక్తిగల పౌరుడు తన పనిని తాను నిబ్బరంగా చేస్తుఉంటే యుద్ధప్రయత్నాలకు ఎంతమాత్రం ఆటంకం కలుగదు. అవసరంకాగల రక్షణోపాయాల నన్నిటిని గవర్నమెంటువారు ఏర్పాటు చేశారు. ఏదైన ఆపద సంభవించే సందర్భంలో విమానదాడి రక్షణ ఏర్పాట్లు, అగ్నిప్రమాదాలను ఆర్పే ఏర్పాట్లు, ప్రజలను ఆపదనుండి రక్షించే ఏర్పాట్లు; దాడి జరిగే సందర్భంలో, మోసాలు జరుగకుండాను, దుండగీండ్రు సమయంచూచుకొని బాధించకుండాను చేయడానికి పోలీసువారిని నియమించే ఏర్పాట్లు, ఆహార పదార్థాలలో సరఫరా చేసే యేర్పాట్లు, ఆరోగ్యము రక్షణ గలిగించే యేర్పాట్లు మొదలైనవెన్నో సిద్ధపరచబడినవి.

సైనిక ఏర్పాట్ల సందర్భములో అనగా సైనిక దళములు, నావికా దళములు, వాయుదళముల సందర్భంలో యీ పట్టణాన్ని రక్షించే సరంజామంతా సిద్ధముగానున్నదని మీరు నమ్మండి. కాబట్టి వింతలైనట్టిన్ని అబద్ధములైనట్టిన్ని వదంతులను నమ్మవద్దు, వ్యాపింపచేయవద్దు. గవర్నమెంటు కోయంబత్తూరు వెళ్లుతుందని, హైకోర్టు మధురకు వెళ్లిందని, రాత్రిపూట రైళ్లనిండా యూరోపియను స్త్రీలును శిశువులును మదరాసును విడిచిపెట్టి పోతున్నారని వదంతులు యిటీవల పెద్ద పెద్ద వారి యిండ్లలోకూడ వ్యాపించినవి. ఈ కథలన్ని అబద్ధాలును, దుర్మార్గులు సృష్టించినవిన్ని మాత్రమే. అట్టి భయముకొల్పే కథలను మీరు వింటే, వాటిని ఎక్కడ విన్నాడో, అవి బాధ్యతను వహించే వార్తా పత్రికలలో ఎందువలన ప్రకటింపబడలేదో, మీకు చెప్పిన మనిషిని నిలవదీసి అడగండి. భయోత్పాతాలను కలిగించే ఉద్దేశంతో యిట్టి కథలను బుద్ధిపూర్వకంగా వ్యాప్తిచేసే మనుష్యులు మీకు కనపడినట్లైతే వారిని గూర్చి మీరు పోలీసువారికి తెలియజేయండి. మదరాసునకు ఆపదగలిగించే సంగతులేవైన జరిగినయెడల సకాలంలో గవర్నమెంటువారు ప్రకటనలను ప్రకటించెదరని మీకు గట్టిగా చెప్పుచున్నాను. అవి నిజమైనవేనని మీరు నమ్మండి. దోపిళ్లుజరుగతవనే వదంతులను మీరు నమ్మకండి. అట్టివి వాస్తవముగా బహుకొద్దిగా మాత్రమే జరిగినవి. అట్టి విపత్తు ఏదైన బయలుదేరితే దానిని గట్టిగా అణచడానికి గవర్నమెంటువారికి తగినంత పోలీసు సిబ్బంది ఉంది. గవర్నమెంటువారు ధరలు తగ్గించినారు, తగ్గించనున్నారు. అమితలాభాలను పొందనివ్వరు. బీదవారికి అవసరమైన వస్తువులన్ని చౌకగాదొరికే ఏర్పాట్లు తప్పక చేస్తున్నారు. సిపాయిలు వస్తే నగరంలోని స్త్రీలను చెరపడుతారని వదంతిబాగా వ్యాపించింది. దీనికి కారణంలేదు. అక్కడక్కడ బహు కొద్దిగా జరిగిన సంగతులనుబట్టి యీ కారణములేని వదంతి వ్యాపించింది. ఈ విషయంలో సైనికశాఖవారు గట్టి ఉత్తరువులను జారీచేశారనిన్ని, వారు యింతకుముందుకూడ శిక్షించుచున్న విధముగానే ఏ నేరస్థునైనా గట్టిగా శిక్షించెదరనిన్ని నేను బహు దృఢముగా మీకు చెప్పుచున్నాను. చివరకు నేను చెప్పేదేమంటే, యిప్పుడు అపాయము ఎక్కువగా లేనప్పటికిన్ని మీరు గమనించవలసిన విమానదాడి రక్షణల విషయమై మీ స్థానిక ఉద్యోగులవద్ద మీరు తెలుసుకోవలెను. దాడివస్తే ఏమిచేయాలనే విషయాన్నిగూర్చి నా సలహా ఏమంటే, "రక్షణస్థానాలలో చేరి, నిబ్బరముగా నుండండి" అనేదే. ఈ సలహాను పాటించియున్నట్టయితే మొదటి దాడిలో రంగంలో సంభవించిన చావులు చాలమట్టుకు జరిగియుండేవికావు. మీరు చురుకుగలవారును దేశభక్తిగలవారును అయితే విమానదాడి రక్షణ సిబ్బందిలో మీరు చేరుట ఉచితము. మీరందువల్ల బాధ్యతగలట్టిన్ని ఉపయోగకరమైనట్టిన్ని పనిని చేయుదురు. ఈ సమయంలో మీరు మీదేశీయుల రక్షణకు మీచేతనైన పనిని మీరు చేయుచున్నారనే తృప్తి మీకు కలుగగలదు. చివరకు యీ యుద్ధంలో మనము జయించుట నిశ్చయము. కాని జయమువచ్చుటకు చాలపని జరుగవలసియుండును. దుఃఖమనుభవించవలసియుండును. అశాంతిని పొందవలసియుం

డును. మన విభేదాలను మరచిపోయి మనముకలసి పని చేసినకొద్దీ మనకు జయము చేరువకువచ్చును. మిత్ర రాజ్యముల బలము రానురాను పెరుగుచు, అజేయమగును. ప్రపంచము కనివిని యెరుగని యీ దుర్భరమైన ఆపదను మనము తొలగించి శత్రు నాశమొందించగలమను దృఢవిశ్వాసముతో మనము భావి పరిణామమునకు ఎదురుచూడవచ్చును.

# ప్రధాన మంత్రి ప్రధాన మంత్రం.

జపానువాళ్లు సాగించిన దండయాత్ర సామాన్యమైనది కాదు. చాలా బ్రహ్మాండమైనది. అందుకు సందేహం లేదు. ఆదిశక్తిమీదకు పూర్వం మహిషాసురుడు యుద్ధానికి వచ్చినట్లుగా వుంది. ప్రపంచమంతటిలోనూ బ్రహ్మాండమైన బ్రిటిషు సామ్రాజ్యంతోను, ప్రపంచమంతటికీను, పెద్దరికం వహించి, కుబేరునివంటి ఐశ్వర్యంతో తులతూగుతూ, ప్రపంచానికంతకూ ఆయుధాలూ, విమానాలూ, యుద్ధ నావలూ తయారుచేసి సప్లయిచేయగల్గుతున్న అమెరికా రాజ్యంతోను, మన యిండియా రాజ్యానికంటె చాలా పెద్దదైన చైనా రాజ్యంతోను జపానువంటి చిన్న రాజ్యం యీ రోజున యుద్ధం సాగించింది. ఒక్కటే గుక్కలో మూడు ముద్దలు మింగవలెనన్నట్లుగా చైనాతో, బ్రిటిషువారితో, అమెరికా వారితో జపాను యుద్ధం సాగించింది. ఇది చాలా సాహసకార్యం. ఆసియాఖండం అంతా తానే కబళించాలని జపాను బ్రహ్మరాక్షసిలాగున నోరు తెరుచుకున్నది.

జపాను అనే చిన్నరాజ్యం. జనసంఖ్య చాలా తక్కువ. ఈ ఎలుకవంటి రాజ్యం ఏనుగను మింగవలెనన్నంత ఆశతో నోరు తెరుచుకున్నది. ఆఖరుకు, ఏనుగు కాలికిందనే ఎలుక నలిగి చచ్చిపోతుందిగాని, ఏనుగును ఎలుక మింగడం అసాధ్యం, అసహజం, అసంభవం. పూర్వమొక కోతికి ఒక పెద్ద కొబ్బరికాయ దొరికితే, "వాటంగా ఉందిరా" అని, ఆ కొబ్బరి కాయను నమిలి మింగాలని ఆశపడింది. ఆ కొబ్బరి బొండానికి ఒక పెద్దరంధ్రం అది వగకే ఒక ఉడత చేసింది. ఆ కొబ్బరికాయి కోతినోట్లో దూరుతుందా? కొబ్బరి కాయలోనే కోతి తలపెట్టవలెనా? కొబ్బరికాయ పెద్దది. కోతిమూతి చిన్నది. అందువల్ల కోతితలనే కొబ్బరికాయ రంధ్రంలో దూర్చింది. తన నోటికి అందినంతవరకూ లోపలవున్న కొబ్బరినితిన్నది. కాని, కొబ్బరికాయలోపల దూర్చిన కోతితల బయటకు రావడంలేదు. "కుయ్యో! ముర్రో!"అని గిజగిజలాడి ఊపిరి సలుపక, కొనఊపిరితో కొట్టుకొనిచచ్చింది.

ఇదంతా కల్పించిచెప్పే కవిత్వంకాదు. జపాను సేనల గతి ఇప్పుడు అదేవిధంగాఉంది. మొన్న చైనాలో హూనాను పరగణాలో చాంగ్షానగరంవద్ద 40 వేల జపాను సేన అకస్మాత్తుగా చైనా సేనలయొక్క పద్మవ్యూహంలో చిక్కుకొని పోయింది. అడకత్తెరలోపోక చెక్క కత్తిరింపబడినట్లుగా, రెండు వైపులనుంచి కత్తెర వ్యూహంగావచ్చిన చైనా సేనలమధ్య 40 వేల జపానుసేన ఒక్క పర్యాయంగా చిక్కుకొని పోయింది. పారిపోవాలని జపాను సేనలు ప్రయత్నిస్తుఉంటే, 8 వేలమంది జపాను సైనికులు ఆ యుద్ధరంగంలోనే నాశనమైనారు. ఆ ప్రాంతంలోనే ఇంకొక చోట మొన్ననే మరొక వెయ్యిమంది జపాను సైనికులు చైనా వారి కత్తెరవ్యూహంలో చిక్కుకొనిపోయినారు. ఇక్కడ అపారంగా చచ్చిపోతున్న జపాను సైనికులకు అందరికీ చైనా సేనాధిపతి దహన సంస్కారంచేసి, వారి అస్థికలన్నీ పూడ్చిపెట్టడానికి రెండు బ్రహ్మాండమైన గోతులు తవ్విస్తున్నాడని వార్త వచ్చింది. పాపం! జపాను సైనికులకు ఎటువంటి గతి పట్టిందో చూడండి! చైనాలో చచ్చిపోయిన జపాను సైనికుల కందరికీ చీనావారే కర్మ చేయవలసివచ్చింది. ఆఖరుకు దేశంకాని దేశంలో దిక్కులేనిచావు చస్తున్నారు, యీ జపాను సైనికులు.

జపాను సైనికులు యీవిధంగా చైనాలో భస్మమైపోతు ఉంటే, జపాను యుద్ధనావలను అమెరికను జలాంతర్గాములు గంగపాలు చేస్తున్నాయి. పసిఫిక్కు సముద్రంలో ఉన్న అమెరికావారి లంకలమీదకు దండెత్తడంకోసం యుద్ధనావలను జపానువారు పంపిస్తున్నారు. వేకు దీవివద్ద ఇంతవరకు 7 జపాను యుద్ధనావలు ముంచివేయబడినవి. "హరహర మహదేవ్" అని సముద్రస్నానం చేస్తున్నాయి. తిరిగీ 8 జపాను సరుకుల నావలనుకూడా అమెరికను జలాంతర్గాము ముంచివేశాయి.। అక్కడ చైనాలో జపాను సైనికులకు చక్కగా దహన సంస్కారాలు జరుగుతున్నాయి. ఇక్కడ నడి సముద్రంలో అమెరికావారి జలాంతర్గముల మూలంగా జపానువారికి సముద్రస్నానంకూడా లభిస్తోంది. జపానువారికి జపం తపం లేకపోయినా, వాళ్ల శత్రువులు కూడా వాళ్లకు కర్మలోపం చెయ్యడంలేదు. జపాను వాళ్లకు అంత్యక్రియలు బాగానే జరుగుతున్నాయి

## హిట్లరుని నమ్మిన ఫలితం.

ఇంతకూ, జపానుకు యింత అంత్యకాలం రావడానికి ఆసలు కారణమేమిటి? జపానును యిటువంటి ఘోర యుద్ధరంగంలోకి హిట్లరు దింపాడు. "నీకేమీ భయంరాదు. ప్రక్కను నేను ఉన్నానుగా!" అని జపానుకు హిట్లరు హుషారు యిచ్చాడు. ఆ హిట్లరును నమ్ముకొని, హిట్లరు పెట్టిన ముహూర్తం నమ్ముకొని, తన జాతక చక్రంకూడా హిట్లరుకు బాగా చూపించుకొని, హిట్లరు తనకు బాగా ధైర్యం చెప్పిన తర్వాత, అమెరికా వారిమీద బ్రిటిష్‌వారిమీద జపాను తెగించి యుద్ధానికి దిగింది. లోతు తెలియకుండా దిగింది. పసిఫిక్కు సముద్రం ఎంత లోతున్నదో తెలియకుండా దిగింది. దిగినకొద్దీ లోతు తెలుస్తుంది. ఈ కాలంలో "దిగు, దిగు" అనేవాళ్లేగాని, వెంటదిగేవాళ్లు ఉండరు. జపానుకు హిట్లరు హుషారుయిచ్చి జపానును యుద్ధంలోకి దింపేడేగాని, జపానుకు తన ఆయుధబలంగాని, అంగబలంగాని, అర్థబలంగాని ఏమైనా సప్లయిచేసి సహాయం చేస్తున్నాడా? అటువంటి దేమీలేదు. అయినా, సప్లయి చెయ్యాలన్నా, పదివేల మైళ్ల దూరాననున్న జర్మనీనుంచి జపాకు ఏదీ సప్లయికాదు. అంగడిలో బెల్లం అంగడిలోనే ఉంది. గుళ్లో దేవుడు గుళ్లోనే ఉన్నాడు. కాని అంగడిలో బెల్లమునే, ఒక సాహుకారు గుళ్లో దేవుడికి నివేదన చేసాడు. జపానుకు హిట్లరుచేసే సహాయంకూడా అంతే. ఒక వేళ హిట్లరు ఏదైనా సప్లయిచేయడానికి, హిట్లరు దగ్గరమాత్రం ఉన్నదేమిటి?

రష్యా యుద్ధంలో హిట్లరుగారి పని అయింది. దివాలా తీసాడు. రష్యాలో జర్మను సేనలు వెనుకకు తిరిగిచూడకుండా దవుడు తీస్తున్నాయి. ఇక్కడికే 60 లక్షల సేన దాదాపుగా జర్మనీకి నష్టమైంది. జర్మనీకి మిగిలిఉన్న నిల్వ పటాలాలను (అనగా ఆఖరుదశలో ఉపయోగించుకోవలసిన రిజర్వు సేనలను) హిట్లరు యిప్పుడు బయటకు తీసికొని రావలసివచ్చింది. ఇంతవరకూ హిట్లరు జయించినటువంటి పోలండు, బెల్జియం వగైరా దేశాలలో కాపలాగా హిట్లరు ఉంచినటువంటి జర్మను సైనికులనుగూడా రప్పించి వేస్తున్నాడు. అక్కడవాళ్లకు బదులుగా, గాయపడి నటువంటి జర్మను సోల్జరులనూ, చేతులు కాళ్లు విరిగిపోయిన జర్మను సోల్జరులనూ కాపలాగా ఉంచుతున్నాడు. కనుక హిట్లరుకు

తన వద్దవున్న జనం తనకే చాలడంలేదు. రష్యాలో జర్మను సేనలు పారిపోవడంచూస్తే, పారిపోవడంలోకూడా జర్మనుల తెలివితేటలు చాలాఎక్కువగా బయటపడుతున్నాయి. ఇంట్లోకి చొరబడినకుక్కనుచూచి "కర్రతే! కర్రతే!" అని రెండు కేకలువేసేసరికి, దొడ్డిగుమ్మంలోనుంచి అది పారిపోయినట్లుగా, జర్మనసోల్జర్లు పారిపోతున్నారు. జర్మను సోల్జరులు రష్యాలో చొరబడినప్పుడు సింహాలులాగున చొరబడ్డారు; ఆఖరుకు గ్రామ సింహాలులాగున పారిపోతున్నారు. పారిపోయేటప్పుడు జర్మను పటాలముల తాలూకు జర్మను ఫిరంగులను మందుగుండు సామానులను అక్కడి మకాముల లోనే విడిచిపెట్టి తోకముడతపెట్టి పారిపోతున్నారు మాలోయావోస్లావెజ్ అనే ఊరికి పడమరగా నాలుగు రోజులలో జర్మనుసేనలు 14 మైళ్లు పారిపోయినారు. 13 గ్రామాలు తిరిగి రష్యనుల చేతులలోకివచ్చాయి. అక్కడ జర్మనులు విడిచిపెట్టి వెళ్లిన ఫిరంగులను రష్యనులు పట్టుకొని, అక్కడ జర్మనులు విడిచిపెట్టి వెళ్లిన ఫిరంగి గుండ్లనుగూడా తీసికొని, ఆ జర్మనీ ఫిరంగులతో ఆ జర్మను ఫిరంగిగుండ్లను పారిపోతున్న ఆ జర్మను సేనలమీదనే బారుచేసి రష్యనులు కాల్చారు. మాస్కో ప్రాంతాలలోని కొన్నిచోట్ల రోడ్లమీద జర్మను సోల్జరుల శవములు కుప్పలుతిప్పలుగా పడివున్నాయి. రస్తాలన్ని శ్మశానాలులాగున వున్నవని రష్యానుంచి వార్తలు వస్తున్నాయి.

రష్యాలో జర్మనుసేనలు ఎంత ధైర్యంగా పారిపోవుతున్నారో, ఉత్తరాఫ్రికాలోని లిబియాలోకూడా అంత ధైర్యంగా బ్రిటిషు సేనలకు తమ మకాములన్ని వదలిపెట్టుతున్నాయి. మకాములు వదలిపెట్టి పారిపోతే బాగానేవుండును. వదలపెట్టి పారిపోలేక యుద్ధఖైదీలుగా పట్టుబడుతున్నారు. ఇప్పటికే ఈ కొద్దిరోజులలో 26 వేలమంది శత్రుసైనికులు యుద్ధఖైదీలుగా పట్టుకోబడినారు. వీరిలో 7 వేలమంది జర్మను సైనికులు. ఈ 26 వేలమంది యుద్ధఖైదీలను బ్రిటిషువారు ఈజిప్టులోకి చేర్చారు.

## ఫిన్లండుకి ప్రాయశ్చిత్తం.

రష్యాలో హిట్లరుగారు ఆకాశానికి తూటుపొడిచివేస్తాడనే ఆశతో ఆ హిట్లరును నమ్ముకొని ఫిన్లండుదేశం తన సేనలనుకూడా రష్యామీద దండెత్తడానికి పంపించింది. రష్యాతో యుద్ధంచేసింది. కాని, "హిట్లరుగతి హిట్లరుచూచుకుంటున్నాడు." "ఏదీ గతినాకు! రంగా! రంగా!" అంటున్నాడు. అటువంటి స్థితిలో ఫిన్లండు ప్రభుత్వం "ఏమిబుద్ధి! ఏమిబుద్ధి!" అని చెంపలువేసుకొని, రష్యాతో సంధిచేసుకుంటాను అని ప్రకటిస్తోంది. రష్యాకు కబురు చేస్తోంది. "ఇక నీజోలికి నేనురాను. నా నేరములెంచకు రష్యా!" అని బ్రతిమాలుకుంటూ వున్నది. ఫిన్లండుకు కొంత ప్రాయశ్చిత్తంకూడ జరిగితేనేగాని, రష్యాశిష్యవర్గంలో ఫిన్లండు చేరడానికి వీలవుతుందా? హిట్లరును నమ్ముకొని యుద్ధరంగంలోకి దిగినందుకు ఫిన్లండుకు యీగతి పట్టింది. దానిమాదిరిగానే రంగంలోకి దిగినందుకు జపానుకూడా "రంగా! రంగా! ఏదిగతి నాకూ!" అనే రోజులు తప్పకుండా వస్తాయి. జపాను యింకా రంగంలోకి పూర్తిగా దిగాలి. రంగూనుమీద ఇంకా అప్పుడప్పుడు బాంబులు వేస్తోంది. "రంగంవెడ్తా! రంగంవెడ్తా!" అని జపానువాడు చంకలు కొట్టుకుంటున్నాడు. కాని, బర్మాలోకి చైనాసేనలు వేనవేలుగా వొస్తున్నాయి. చైనానుంచి బర్మాలోకివచ్చే రోడ్డు యావత్తు చైనా సేనలతో క్రిక్కిరిసిపోయిందని ఆ రస్తామీదుగా మొన్నవచ్చిన ఒక ప్రయాణికుడు చెప్పినాడు. ఫిరంగి మోటార్లు, ఫిరంగులు వగైరా యావత్తు ఆయుధ సామగ్రితోను యీ చైనాసేనలు విధి విరామంలేకుండా బర్మాలోకి వస్తున్నాయి. జపానుసేనల యుద్ధపద్ధతులన్నీ యీ చైనాసేనలకు యిటీవల అయిదేళ్లనుంచీ బాగా అనుభవసిద్ధంగా బోధపడినాయి. అటువంటి చైనాసేనలు ఇప్పుడు బర్మాలో ప్రవేశించి, జపాను సేనలకు అక్కడ జవాబు చెప్పడానికి సిద్ధంగా వున్నాయి. చైనాసేనలకు, జపాను సేనలకు బర్మాలో యుద్ధంతప్పదు. బ్రిటిషు ప్రధాన మంత్రి చేసిన తంత్రం ఇది.

ఎవరెవరికి ఎట్లా పోటీపెట్టి యుద్ధకాండ సాగించవలెనో, బ్రిటిషు ప్రధానియైన విన్‌స్టను చర్చిలుగారికి తెలిసినట్లుగా ఇంకెవ్వరికీ తెలియదు. ఈ మహా సంగ్రామానికి హిట్లరు మూలకారణం. వ్యాధికి మూలకారణమేదో కనిపెట్టి దానికి ఘాటైన మందు వెయ్యాలి, లేదా శస్త్రం చెయ్యాలి. హిట్లరును ఓడిస్తేచాలు. ఆ హిట్లరును నమ్ముకొని ఉన్న ఇటలీ, జపాను రాజ్యాలు రాజీకి రాకమానవు. జర్మనీతో నేస్తంకట్టిన రాజ్యాలనే అక్షరాజ్యాలని అంటున్నారు. ఈ అక్షరాజ్యాలకన్నింటికీ అక్షయపాత్ర చేతికి రావాలి అంటే ఈ ముఠాకు పీఠాధిపతియైన హిట్లరునే ఓడించాలి. హిట్లరును ఓడించాలిఅంటే, బ్రిటిషువారున్నూ, అమెరికావారున్నూ తమ బలం యావత్తు ఏకముఖంగాచేర్చి జర్మను సేనలతో పోరాడాలి. ఈ మూల సూత్రం, ఈ తంత్రరహస్యం బ్రిటిషు ప్రధానమంత్రియైన చర్చిలుగారు బాగాగ్రహించి, అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారికి బోధపరిచారు. అమెరికా ప్రభుత్వం యీ రహస్య తత్వం గ్రహించింది. మొన్ననే అమెరికా ప్రభుత్వ నౌకాదళ కార్యదర్శియైన కర్నలు నాక్సుగారు తమ అభిప్రాయ ప్రకారంగాకూడా, హిట్లరును ఓడించడమే ప్రథమ కర్తవ్యం అని స్పష్టంగా చెప్పారు. అమెరికను సేనలను, ఇంగ్లాండుకే పంపిస్తాము అని ప్రెసిడెంటు రూజువెల్టుగారుకూడా అన్నారు. చెట్లును మొదలంటు నరికివేయాలిగాని కొమ్మలుకొట్టితే ఏంలాభం? హిట్లరుతో యుద్ధంచేసి హిట్లరును ఓడించడానికి జపానుతోను, ఇటలీతోను, యుద్ధం చెయ్యడం ప్రధానవిషయంకాదు.

అందుకనే, బ్రిటిషు బలం, అమెరికను బలం జపానుమీద ఎక్కువగా ప్రయోగింపబడటంలేదు. ఆ కారణంచేత జపాను ఇపుడు తుపానువలె పసిఫిక్కు సముద్రంలో చెలరేగుతూవున్నది. రేపు మన ఇండియా చుట్టూవున్న సముద్ర ప్రాంతాలవరకూ యీ జపాను తుపాను వచ్చినా, ఎట్లా వచ్చిందో అట్లాగే పోతుంది. అది సముద్రపు పోటూ, ఆటూవంటిదే. యీ జపాను తుపానువల్ల అంతగా అపాయంలేదు. అమెరికా సహాయంతో బ్రిటిషువారు హిట్లరు అనే భూతానికి అక్కడ ఐరోపా ఖండంలో ఉద్వాసన మంత్రం జపిస్తున్నారు. ఆ జర్మను భూతాన్ని ముగ్గులోకి రప్పించి బుడ్డిలోకి ఎక్కించి, బిరడా వేస్తారు. అప్పుడు యీ జర్మనీని నమ్ముకొని నట్టేటిలోపడిన జపానుకు పుట్టి మునుగకమానదు. ఈ విధంగా శత్రువును చేదించవలెననే మంత్రం మన బ్రిటిషు ప్రధాన మంత్రి అమెరికాకు ఉపదేశించాడు. ఇంగ్లాండున్నూ, అమెరికాయున్నూ, ఉభయులూ యీ శత్రుచ్ఛేదైక మంత్రమునే యిప్పుడు ఉపాసన చేస్తున్నారు. ఇదే విన్‌స్టను చర్చిలుగారు అనుసరిస్తున్న కర్తృవ్యతంత్రం. విజయ సంధాన మంత్రం! శత్రుచ్ఛేదైక మంత్రం! జప! జప! సతతం" యుద్ధ సాఫల్య మంత్రం!" మనము చేసే యుద్ధం ఫలించడానికి ఇదే దివ్యమైన మంత్రం గనుక దీనిని నిత్యం జపించండి! జపించండి! అని బ్రిటిషు ప్రధాన మంత్రియైన చర్చిలుగారు బాహాటంగా చాటిస్తున్నారు. మనప్రధాన మంత్రి ప్రభావం మున్ముందు తెలుస్తుంది. 1942 వ సంవత్సరంలో హిట్లరును ఓడించి 1943 వ సంవత్సరంలో విజయభేరీ మోగిస్తానని చర్చిలు ప్రధాని ప్రతిజ్ఞ చేసేడు! తథాస్తు.

# వివిధ యుద్ధరంగాల స్థితి.

## రష్యాలో విజయం, పసిఫికులో విజయ సూచనలు.

### నౌకానష్టాలు చాల తగ్గినవి.

పసిఫికు యుద్ధరంగమునందలి వ్యవహారములగూర్చి తీవ్రమగు విమర్శలు బయలుదేరినవి. అది సహజమే. పొరబాటులు జరుగుతూవుంటాయి. వాటిని దిద్దుటకు ఒకటే పద్ధతిగలదు. అది ప్రజాభిప్రాయం తెలుసుకొని ఆప్రకారం చేయుటే. ప్రజాప్రతినిధుల ప్రభుత్వములందు అనుసరించే పద్ధతేయది. బాధ్యతగల నాయకులెవ్వరు యీ విమర్శలకు కోపగించుకొనరు. పసిఫికు సముద్రమునందలి యుద్ధం, ఆస్ట్రేలియాకు ఇండియాకు కూడ యెక్కువ సన్నిహితమయినది. అందుచే హాంగుకాంగు, మలయాల రక్షణలగూర్చి యీ దేశములలో నిరసనము ఎక్కువగా వినవచ్చెను. అందుచే ఆ విమర్శలకు సంజాయిషీలు వెలువడుచున్నవి.

కాని ప్రపంచమంతట జరుగుచున్న యీ యుద్ధంలో ఒకమూల జరుగుచున్నదానినిబట్టి చూడలిపోరాదు. ఇది ప్రపంచ యుద్ధమగుటచే కాలక్రమేణ కలుగు ఫలితాలనుబట్టి నిర్ణయించుకోవాలి. అన్ని యుద్ధరంగాలలోను నౌకాదళం విమానదళాల ఆధిక్యత కాపాడుకొనుటే మిత్రమండలిదేశాల యుద్ధవ్యూహమయి యున్నది. రష్యా, లిబియాలలోను ఇంగ్లాండులోను విమానశక్తి అధికంగనే యుంటున్నది. నౌకాదళచర్యలందు, శత్రువునకు నౌకామార్గాలు లేకుండా చేసి తమనౌకలు, తటస్థదేశాల నౌకలు యధేచ్ఛగ ప్రయాణం చేసుకొనుటకు అవకాశాలు కలుగజేయుట ముఖ్యమయినది. శత్రురాజ్యాలకు నౌకామార్గలు కాపాడుకొనవలసిన బాధ్యత ఒక్క లిబియావద్దను, ఏషియా ఆగ్నేయ దిక్కున మాత్రమేయుండ, మిత్రమండలి రాజ్యాలకు అనేక వేలమైళ్లవరకు దూరదూరాన వ్యాపించియున్న నౌకామార్గాలను రక్షించుకోవలసిన బాధ్యతకలదు. వాటిని కాపలాకాయవలసిన పని చాల కష్టమయినది.

### అట్లాంటికు యుద్ధం.

అట్లాంటికు సముద్రమునందు 1941 వ సం॥ ప్రారంభంలో నౌకలనష్టం యించుక ఆందోళనకరంగానుండినా, యీ యేడు ప్రారంభంలో చాల సంతృప్తికరమగు మార్పు వచ్చింది. గతసాంవత్సర భాగంలో ప్రయాణంచేయు నౌకల గుంపుపై శత్రువులదాడి నాలుగోవంతు తగ్గెను. ప్రయాణ రక్షణలు యెక్కువచేయుటచేతను రాయలు విమానములు, సబుమెరైనులు ఎక్కువ తోడ్పడుటచేతను నౌకలనష్టం తగ్గెను. వర్తక నౌకలపైనుండు అతివడిగ పోవు ఫైటరు విమానాలు శత్రువుల బాంబరు విమానాలను పడగొట్టుచుండేవి. నౌకలనష్టం 1941 వ సం॥ ఏప్రిలు సంఖ్యలకు సాలాంతం సంఖ్యలకు 100 : 8 వంతు వ్యత్యాసంగలదు. శత్రువుల పెద్ద యుద్ధనౌక బిస్మార్కు ముంచబడుటేగాక, స్కారను హార్స్టు, గ్నిసెనావు, ప్రింసు యుజెను అను మూడు యుద్ధ నౌకలు బ్రెస్టురేవులో కొన్ని నెలలనుండి కదలకుండా చేయబడినవి. "ఆగస్టు మాసం సరికి శత్రువులకు ఆహారం తీసుకపోవుటకు గూడ నౌకలు ఉండవు" అని జర్మను రేడియో మే మాసంలో చెప్పింది. కాని ఎనిమిది నెలలు గడచిన పిమ్మట గూడ అమెరికానుండి ఆహారపదార్థముల నౌకలు సురక్షితంగా ఇంగ్లాండు చేరినవి. ఇదివరకు 10 లక్షల టన్నుల సరకు చేరింది. కనడా సైనికదళములు ఐదున్ను, కనడాలో శిక్షణపొందిన వేలకొలది వైమానికులును, లక్షల కొలది టన్నుల యుద్ధ సామగ్రియు అమెరికా నుండి సురక్షితంగా ఇంగ్లాండు చేరెను. రాయలు నౌకాదళమువారు శత్రువుల జలాంతర్గాములను అంత నేర్పుగ తప్పించుకొనుటేగాక, నాశనం గూడ చేసిరి కనుక, యిపుడు అట్లాంటికు సముద్రంలో 100 స్టీమరుల గుంపుకూడ క్షేమంగా ప్రయాణం చేయగలదు. మందు గనులను తొలగించు నావికులు 25,000 మంది సుమారు 4,000 గనులను కనిపెట్టి నిరుపయోగ మొనర్చిరి.

### ఆఫ్రికా, యూరపు, మధ్య సముద్రం.

యూరోపు ఆఫ్రికాలమధ్యనున్న సముద్రమునందు ఇటలీ అధికారం క్షీణించిపోయింది. అడ్మిరలు కనింగుహాముగారు ఇరిట్రియా, సోమలీలాండు, ఇతోపియా, సిరనైకాలను బ్రిటిషువారి స్వాధీనమునకు తెచ్చిరి. లిబియా యుద్ధం ప్రారంభం కాకముందు, ఆ సముద్రంలో శత్రువుల సప్లై నౌకలు రోజు కొకటి చొప్పున ముంచబడుచుండెడివి. లిబియా యుద్ధం ప్రారంభమయినాక శత్రురాజ్యాలసరకు లిబియాకు నూరులో 60 వంతు కూడా చేరుటలేదు. టొబ్రుకు రేవును శత్రువులు 245 రోజులు ముట్టడి చేసినా అందలి సైనికులకు సముద్రమార్గమున బ్రిటిషు నావలు సరకు సప్లై చేయుచుండగల్గినవి. దానిబట్టియే ఆ ప్రాంతమున బ్రిటిషు నౌకాదళశక్తి ఎంత యెక్కువగనుందో రుజువగుచున్నది.

### రష్యా విజయము.

రష్యా విజయములగూర్చి వేరుగ చెప్పనక్కరలేదు. చలికై దాగొనియున్న శత్రువును యింకా వెనుకకు తరిమివేసిరి. అచట ఫిబ్రవరి ఆఖరువరకు అమితమగు చలి మంచు బాధయుండును. అది రష్యనులకు అలవాటే కనుక నాజీ శత్రువును యింకా పడమరకు తరిమివేయగలరు. కాని జర్మనీకి చాల సదుపాయములుండుటచే ఎంతకాలంలోగా తరిమివేయగలరో చెప్పవీలులేదు. రష్యా తిరుగు దాడివలన తనకు కలిగిన పరాజయముచే ముందేమి చేయాలో తోచక హిట్లరు చిక్కులుపడుచున్నాడు. తన సేనలను స్పెయిను ద్వారా లిబియామీదకుగాని, టర్కీ మీదుగ కాకసను పైకిగాని పంపలేకుండా వున్నాడు. ఇపుడారీతి దాడి ప్రారంభించినచో రష్యాతో పోరుచున్న తన సేనలు మరింత పలుచబడి, యింకా వెనుకకు తరిమివేయబడగలవు.

### పసిఫికు యుద్ధం.

పసిఫికు సముద్రమునందలి యుద్ధం మిత్రమండలికి అనుకూలంగా లేదు. రష్యాకు, లిబియాకు విమానాలను యితర సేనలను బ్రిటను అమెరికాలు పంపవలసివచ్చుటచే పసిఫికు నందు శిబిరరక్షణ ఉండవలసినంత దిట్టంగాలేదు. ఇతర యుద్ధరంగాలలో విజయాలు పొందుచున్నందునను, పరిమార్చవలసిన శత్రువర్గంలో అందరికన్న పెద్ద శత్రువు జర్మనీ యగుటచేతను పసిఫికులో ఓటమికి అంతగా నిరుత్సాహ పడరాదు. పసిఫికు యుద్ధం ముఖ్యంగా నౌకాశక్తిపై ఆధారపడియుంది. విమానదళం సహాయంతో కూడిన నౌకాశక్తియే యీ యుద్ధాన్ని సంతృప్తికరంగా ముగించగలదు.

పెరల్ హార్బరు హవాయిలలో విశేష నష్టమున్ను, ప్రిన్సు ఆఫ్ వేల్సు, రిపల్సు యుద్ధనౌకలు ముందుగ మునిగిపోవుటయు, ఇంగ్లాడు అమెరికాల రక్షణశ్రేణిని యించుక బలహీన మొనరించెను. జపానువారి పెద్ద యుద్ధ నౌకలను అమెరికా బ్రిటిషు నౌకలు ప్రస్తుతం యెదుర్కొను జాలకున్నవి. మొదట మోసంచేసి దొంగ దెబ్బకొట్టిన ఫలితం పూర్తిగ వినియోగించుకోవాలని జపాను యత్నించుచున్నది.

# పెద్దవిన్నీ ఇదివరకు వాటికంటె మేలైనవిన్నీ అయిన బ్రిటిషు బాంబర్లు.



రా. వా. విమానశాఖవారివలన ఉపయోగింపబడుచున్న యంత్రాలను దూసుకొనిపోయే 2,000 ల పౌనుల బాంబు. ఆకారంలో పెద్దది కాకపోయినా యీ బాంబు మిక్కిలి నాశనము చేయగలదు. బరువైన యంత్రాలగుండా దూసుకొనిపోవునట్లు యిది నిర్మింపబడ్డది.

ఈ పటములో యంత్రాలను దూసుకొనిపోయే 2,000 ల పౌనుల బ్రిటిషు బాంబు గలదు.

---

ఆదివరకే ఇండో చీనాయందు సమీకరించియుంచిన సేనలను టాంకులు విమానాలను జపాను యిపుడు ఫిలిప్పైన్సు, సరవాకు, డచ్చి తూర్పుదీవులకు అనేక చోట్లకు పంపివేసెను. తాయిలాండును స్వాధీనపరచుకొనుటచే మలయాపై దాడి చేయుటకు వీలయ్యెను.

మిత్రమండలి సేనానాయకుల ఎత్తుల ననుసరించి నౌకాదళచర్య లేవయిన ప్రారంభించేవరకు పసిఫికు సముద్రంలో యిప్పటి దుస్థితి మారుటకు ఎంతకాలం పట్టునో చెప్పజాలం. అమెరికా యుద్ధ నౌకాదళం ఎచటనో రహస్యంగా నుంచబడెను. కాని యీ దిగువ అంశములు ఆశాజనకములుగ నున్నవి :—

1. బర్మాపై దాడివచ్చిన జపాను విమానాలను రాయలు విమానాలు సులభంగా తరిమివేసి, మలయా తాయిలాండులపైగూడ తిరుగు దాడు లొనరించినవి.

2. జపాను సేనలు వివిధ ప్రాంతములకు చెదరియున్నవి. చాంగ్షావద్ద చీనాసేనలు జపాను సేనలపై అద్భుతమగు విజయమును బడసినవి.

3. ఆస్ట్రేలియా రక్షణకును, పసిఫికు ప్రాంత యుద్ధరంగములకును క్రొత్త సేనలు ఆయుధాలు బ్రిటను అమెరికాల నుండి చాల త్వరలో వచ్చుచున్నవని ఆస్ట్రేలియా నౌకామంత్రి మాకినుగారు గత ఆదివారం తెలిపిరి.

4. సింగపూరునందున్న సేనానాయకుడు జనరలు సర్ హెన్రీ పౌనాలుగారు సింగపూరు తప్పక రక్షింపబడుననియు యితర ప్రాంతాలలోవలెనే యిచటగూడ మిత్రమండలికి అనుకూలంగా పరిస్థితులు తప్పక మారగలవనియు, అమెరికా, బ్రిటను, చీనా, డచ్చి సేనలు ఏకనాయకత్వమున పోరాడుచున్నవి గావున విజయం నిశ్చయమనియు చెప్పిరి.

---

# విదేశాలకు పోయిన భారతీయ సేనలు.

## గత యేడు కీర్తివంతంగా పోరుట.

ఇండియానుండి పోయిన సేనలు వివిధ యుద్ధరంగాలలో బహు కీర్తివంతంగా పోరాడినవి. ఆఫ్రికాలో సైరినైకాయందు వావెలుసేనాని ప్రారంభించిన దాడియందు అవి ప్రథమమున పాల్గొనినవి; తర్వాత తూర్పు ఆఫ్రికాయందు బ్రిటిషు సామ్రాజ్య సేనలతో కలసి ముసోలిని సామ్రాజ్యమును నాశనం చేసినవి; ఆటు తరువాత పడమటి యెడారియందు జర్మను టాంకు దళముల నెదుర్కొని ప్రమాదం తప్పించినవి. ఇరాకు, సిరియా, ఇరాను మూడు దేశాలలో అక్షరాజ్యాల కుట్రలను ముందే గుర్తించి, అది వారి వశంకాకుండా తప్పించినవి. ఈ చర్యలన్నింటి వివరములు సంగ్రహంగా యీ దిగువను తెలుపబడినవి.

### ఆఫ్రికా.

ఫ్రాంసు శత్రువులకు లొంగిపోగానే ఇటలీ యుద్ధంలో దిగుటచేత, ఈజిప్టు దేశానికి ముప్పు చేరువయింది. యుద్ధానికి పూర్వమే ఈజిప్టులో భారతీయ సేనలు కొన్ని యుంచబడినవి. వాటికి అదనముగా మరికొన్ని సేనలు పంపబడినవి. ఆయను మరికొన్ని బ్రిటిషు సేనలును 4 వ ఇండియను డివిజను సేనయు ఈజిప్టునుండి లిబియా పడమటి ఎడారికి ఇటలీ యుద్ధంలో చేరగానే పంపబడినవి. 1940 వ సం॥ సెప్టెంబరులో ఇటలీ సేనానాయకుడగు గ్రెజియానీ ఈజిప్టుపై దాడి ప్రారంభించెను. కాని సిదిబరాని వరకే రాగల్గెను. తరువాత డిసెంబరులో వావెలుసేనాని తిరుగు

దాడి ప్రారంభించెను. భారతీయ సేనలు బ్రిటిషు సేనలు సిదిబరాని చుట్టునున్న శత్రు శిబిరాలను వశపరచుకొన్నవి. భారతీయదళం మూడు రోజులలో 20,000 శత్రులను ఖైదుచేసెను. ఆస్ట్రేలియాదళములు సిదిబరాని పూరునేపట్టు కొన్నవి. సైరినైకారాష్ట్రం అంతా వశంచేసుకొనేవరకు దాడి కొనసాగెను.

సిదిబరాని తరువాత, 4 వ భారతీయ దళము తూర్పు ఆఫ్రికాకు మార్చబడెను. అచట అదివరకేయున్న 5 వ భారతీయ దళం, సుడాను సరిహద్దును అత్యధిక సంఖ్యగానున్న ఇటలీ సేనలనుండి రక్షించుచున్న చిన్న బ్రిటిషు సుడాను సైనిక దళములకు సహాయం చేయుచుండెను. 1941 వ సం॥ జనవరి 19 వ తేదీన భారతీయ 4 వ, 5 వ దళములు ఇరీట్రియాదాడి ప్రారంభించినవి. జనవరి 24 వ తేదీన మన సేనలు ఇటలీ సామ్రాజ్య సేనలు 5 బెటాలియనులను కేరూవద్ద నాశనంచేసినవి. మిగిలిన ఇటలీసేన అగోరదటు బరూటులవద్దకు పోయెను. ఈ రెండు చోట్లగూడ తీవ్రమగు యుద్ధం జరిగింది. మొదటిచోట నేర్పువల్లను, రెండోచోట కేవలం ధైర్య సాహసంవల్లను మన వారు గెలిచిరి. తరువాత ఇటలీవారి కొండ శిబిరమగు కరేను పట్టుకొనుటకు పోటీ జరిగెను ఈ కొండనగరం ముట్టడి అన్నింటికన్న కష్టమయినది. భారతీయ సేన యిక్కడనే యెక్కువ పాటుబడెను. దానిని వశపరచుకొనుటకు కొంత కాలం పట్టెను. మార్చి 27 వ తేదిన కరేను పడిపోవుటతో ఇటాలియను తూర్పు ఆఫ్రికా సామ్రాజ్యం శిథిలమయినట్లే. దాని అంతం ఎంతోకాలం పట్టలేదు. అదివరకు ఏడాది క్రిందట శత్రువశమయిన బ్రిటిషు సోమలిలాండు, బెర్బరా పురములందు అపుడు రక్షించుటకు పోరాడిన పంజాబీదళమే యిపుడు ముందుగ ప్రవేశించెను. తూర్పు ఆఫ్రికా సైనిక దళంలోపుకుపోయెను. మస్సావారేవు చేరువగనున్న మందుగనులను బ్రిటిషు ఇండియను నౌకలు తెలివిగ దాటినవి. ఆ రాష్ట్రము సులభంగా వశమయింది. ఆ పైని అబిసీనియాపైకి దాడి రెండు వైపులనుండి ప్రారంభమయ్యెను. అబిసీనియాలోనున్న దేశీయ సేనలు మన సేనలకు స్వాగత మొసంగినవి. అచట రెండవకొండ శిబిరమగు అంబ అలాగి పట్టుకొనుటకు కొంత తీవ్రయుద్ధం జరిగెను. చివరకు ఇటలీ సేనానియగు అయోస్టాడ్యూకు భారతీయ, బ్రిటిషు, దక్షిణాఫ్రికా సమిష్టిసేనలకు లొంగిపోవుటతో తూర్పు ఆఫ్రికా పతనం పూర్తి అయింది.

భారతీయ సేనలను అవసరమున్న యితర యుద్ధ రంగాలకు పోవుటకు ఇప్పుడు పంపవీలయ్యెను. అపుడే భారతీయులు కొందరు పడమర ఎడారి యుద్ధమునందు పాల్గొనుచుండిరి. 3 వ మోటారు కావల్రీ బ్రిగేడు ఎల్‌మిచిలివద్ద నిలచి శత్రువును నిరోధించుటచేత సామ్రాజ్యసేన ప్రధానాంగము టోబ్రుకుచేరి దాని కాపాడకలిగెను. టోబ్రుకు రక్షణయందు మొదటి ఐదు నెలలలో భారతీయులే ఎక్కువ ప్రాధాన్యత వహించిరి. ఆఫ్రికా యుద్ధరంగములన్నింటియందు మొత్తం భారతీయ సైనికులు 6,500 మాత్రమే గాయపడిరి. వారిలో 850 చనిపోయిరి. శత్రువు 2,50,000 లకు పైగా సైనికులను నష్టపోయెను.

## ఇరాక్.

ఇంతలో ఇండియా రక్షణకు ప్రధానమైన యింకో దేశంలో భారతీయ సేనలు పోరు సల్పవలసివచ్చెను. ఇరాకు ప్రధానియగు రషీదాలి జర్మను వాగ్దానాలకు మోసపోయి, ఒడంబడిక ప్రకారం తమ దేశంలోనున్న బ్రిటిషు సేనలను ఎదిరించి, తాను జర్మనీ పక్షమయినట్లు ప్రకటించెను. అతని పరిపాలన మూన్నాళ్ల ముచ్చటయింది. పాలస్తీనానుండి ఒక సైనికదళం, బస్రానుండి ఇంకో సైనికదళంవచ్చి అతని సేనలను ఓడించెను. భారతీయ సేనలు యీ దేశంలో ఎక్కువయుద్ధం చేయనవసరం లేకపోయెను, కాని పోలీసు పనులు మాత్రం చేయుచుండిరి. ఇరాకులో సైన్యాలను నడిపించే బాధ్యత భారత సేనాధిపతికి ఒప్పగించబడెను. కనుక భారతీయ సేనలకు యీ దాడియందు ఎక్కువ శ్రద్ధ యుండెను. తరువాత ఇరానుగూడ భారత సేనాధిపతికే ఒప్పగించబడెను. ఇరాకులో తిరుగుబాటు అణచివేసి, న్యాయమగు పరిపాలకుని స్థాపించిన తరువాత మన సేనలు అచ్చటి పరిస్థితుల కలవాటుబడి స్థిరంగానుండెను. ఇరాకునుండి సిరియా కోసారి, ఇరాను కొకసారి వారు దాడిపోవలసి వచ్చెను.

## సిరియా.

ఇరాకులో రషీదాలి ద్రోహంచేసిన వెంటనే విషి ఫ్రాంసు ప్రభుత్వానికి లోబడియున్న సిరియాలోని విమానాశ్రయములను జర్మను సేనలు ఇరాకు దాడికుపయోగించుట కొసంగబడెను. ఈ రీతిగా జరుగనిచ్చిన యింకా ఎక్కువ ప్రమాదం సంభవించునని స్వతంత్ర ఫ్రెంచి, బ్రిటిషు ఇండియను సేనలన్నికలసి సిరియా పైకిపోయినవి. సిరియా ముఖ్యపట్నమగు డమస్కసునకు, బైరూటునకు భారతీయ సేనలు పాలస్తీనానుండి తీరంమీదుగ పోవుచుండగా అనేక చోట్ల శత్రు సేనలు నిరోధించినవి. రెండు భారతీయ బెటాలియనుల సైనికులు డమస్కసు విమానాశ్రయమగు మెజ్జవద్ద అద్భుతమగు పోరుసలిపి, స్వతంత్ర ఫ్రెంచి సేనలు డమస్కసును వశపరచుకొనుటకు తోడ్పడినవి. అదశములోని భాగతీయ సైనికులను ఆఫీసరులను, బ్రిటిషు ఉద్యోగులను విషీ ప్రభుత్వంవారు సంధి షరతులకు విరుద్ధంగా బంధించియుంచిరి. కాని తరువాత ఒత్తిడి చేయగా విడచిరి. ఇంతలో ఇరాకునుండి ఉత్తర సిరియానుండి భారతీయ సేనలువచ్చి, టర్కీ సరిహద్దు చేరువనున్న విషీశిబిరాలను వశపరచుకొన్నవి. రాష్ట్ర ముఖ్య పట్నమగు హాసాచికూడ వశమయినందున విషీశిబిరాలకు వెనుకనుండి ఎసరుతగిలి, నాల్గు రోజులలో సంధికివచ్చిరి.

## మలయా.

పడమరను ఈజిప్టులోవలెనే భారతదేశపు తూర్పు రక్షణ శ్రేణియగు మలయాలోగూడ యుద్ధం ప్రకటింపబడక ముందే 1939 వ సం॥ ఆగస్టులోనే భారతీయ సైనిక దళమొకటి యుంచబడెను. తరువాత ఒక నెలలో అనేక నౌకలలో క్రొత్త సేనలు పంపబడినవి. త్వరలో మలయాలోనున్న బ్రిటిషు ఆస్ట్రేలియా మలయా సిపాయిలకన్న భారతీయ సిపాయీల సంఖ్య హెచ్చయ్యెను. అక్కడకు పోయినప్పటినుండి భారతీయ సైనికులు క్రొత్తరకం యుద్ధ సామగ్రి యంత్రాలు వాడుక చేయుటయందు తరిఫీదగుచుండిరి. అంతేకాక అడవులలో యుద్ధం చేయుటకూడ నేర్చుకొనిరి.

చిన్న "టామీ గన్ను" పట్టుకొని డొంకలు చెట్లు నరుకుకొని త్రోవచేసుకుంటూ, శత్రువులకు తెలియజాలసి దొంగదారుల నుపయోగిస్తూ, తాయిలాండును డి రాదలచిన శత్రు (జపాను) సేనలకు గొప్ప నిరోధం గల్గించగలరు. మలయాలో విశేషంగా ఆహారపదార్థములు, మందుగుండు చేకూర్చబడియున్నవి. అం దెక్కువ భాగము ఇండియా నుంచి పోయినదే. యుద్ధరంగంలో నిలచిపోరుటకును, శత్రు దాడి నెదిరించి నిలచుటకును, విమానాలను కొట్టే ఫిరంగులు వాడుట, నదులపై సేనలను నడిపించు ఇంజనీరింగు పని, యితర పనులన్నింటికి శిక్షణము భారతీయ సైనికులకు అచట అనునిత్యం ఒసంగబడుచున్నది. భారత సేనలను చూచినవా రందరు వారిని అమోఘంగా పొగడుచున్నారు.

హాంగుకాంగు, బర్మా, ఏడెను నగరాల రక్షణయందు గూడ భారతీయ సేనలు ఎక్కువగ పాల్గొనుచున్నవి.

# సైన్యానికి ఆధునిక యంత్ర సామగ్రి.

నేటి యుద్ధం ప్రారంభమయేసరికి ఇండియాలోనున్న సైన్యం ఎక్కువ భాగం ప్రాత మాదిరిగానేయుండెను. కాని ఆధునిక యంత్ర సామగ్రి, క్రొత్తరకం ఫిరంగులు, టాంకులు మున్నగునవి లేకుండెను. శాంతి సమయంలో పనులు చేయుటకును, సరిహద్దు కొండజాతులతో యుద్ధాలకును తగి యుండెనుగాని, యూరోపు సైనిక నివహాలను ఎదిరించుటకు తగిన సాధనములు లేకుండెను. 1935 వ సంవత్సరము నుండి అంతర్జాతీయ వైషమ్యాలు హెచ్చుచుండుటచేత చెట్ఫీల్డు విచారణ సంఘం నియమించుట జరిగింది. ఈ సంఘం, భారతీయ సైన్యాన్ని ఆధునిక యంత్రసామగ్రి పూర్తిగ గల సైన్యంగా మార్చివేయుటకు తగిన విధానం 1939 వ సం॥ ఫిబ్రవరిలో సూచించెను. అదివరకు గుర్రపు రౌతు దళములు యిపుడు యంత్రసామగ్రి దళములుగ మారవలెను. కాల్బలము యుద్ధ మోటారు దళముగ మారవలసియుండెను. అందొకటి ఇండియాయొక్క దూరపురక్షణ శిబిరాలకు, అంటే ఇరాకు, మలయాలవంటి స్థలాలలో పోరాడుటకును, ఇంకొకటి దేశంలోవుండి దేశరక్షణకు తగినట్లు శిక్షణ యొసంగబడవలెనని చెట్ఫీల్డు కమిటీవారు శిఫార్సు చేసిరి. దేశరక్షణ దళమునకు యంత్రసామగ్రి తక్కువగ ఉండాలన్నా, దానికి మోటారుబండ్లు, మోటారు సైకిల్సు, చిన్న సైకిల్సు అనేకం కావలసియుండెను. ఈ సరకంతా ఐదేండ్లలో తయారుచేసి తరిఖీదు పూర్తిచేయాలని నిర్ణయించబడెను. ఖర్చులో ఎక్కువ భాగం బ్రిటిషు ప్రభుత్వంవారు భరించి మిగిలిన దానికి ఋణమిచ్చుటకు గూడ అంగీకరించిరి.

ఈ కార్యాలన్ని పూర్తికాకముందే యుద్ధం ప్రారంభమయింది. అందువలన సైన్యానికి యంత్రసామగ్రి అతి వడిగా చేకూర్చవలసిన అవసరం ఎక్కువకాగా, ఆ యంత్రాలు వాటిని తయారుచేసే పనిముట్లు, బండ్లు వచ్చే అవకాశాలుగూడ తగ్గిపోయినవి. అనేకచోట్ల యుద్ధం ఒకేసారి జరుగుచుండుటచే బ్రిటిష ప్రభుత్వం ఇండియాకు పంపగల్గినది తగ్గిపోయింది అంతేకాక విదేశపు మారకపు రేట్లు పెరిగినందున ఉత్పత్తి తగ్గిపోయింది. అమెరికా తటస్థ చట్టం గావించి ఎగుమతి చేయనందున ఇంగ్లాండునకు కావలసిన సరకు తటస్థ దేశాలద్వారా తెప్పించుకొనుట కష్టమయ్యెను. ఇండియాలో ఉన్న కొద్దిపాటి యుద్ధసామగ్రి పరిశ్రమలకు ఆధునిక సాధనములు లేవు. ఇతర ప్రైవేటు పరిశ్రమలు శైశవావస్థయందున్నవి. ఆ పరిశ్రమలయందు ఉత్పత్తి ప్రభుత్వమువారి గిరాకీపై ఆధారపడియుండును. ఇదివరకట్టి గిరాకీ లేకుండెను. చెట్ఫీల్డు కమిటీ కార్యక్రమమే యింక కొంచెం ముందుగ నిర్ణయింపబడియుండినచో చాల మార్పు కలిగియుండెడిది. అయినప్పటికి యుద్ధం ప్రారంభమయిన కొద్ది నెలలలోనే 20,000 వివిధ రకాల యుద్ధ సామగ్రి ఇండియాలో తయారగుచుండెను.

## మోటారు యంత్రాలు.

మోటారు దళములను తయారుచేయు విషయమున చాల ప్రతిబంధకాలు దాటవలసియుండెను. యంత్రసామగ్రి లేదు, యంత్రాలు మరమ్మత్తుచేయు పరికరాలు లేవు. పని నేర్చిన నేర్పరులగు పనివారు చాల తక్కువ. కావున విదేశాలనుండి మోటారు ఇంజనులు చేసీసు తెప్పించి, పై కప్పులు ఇండియాలో కట్టించుట, వేరువేరు యంత్రభాగాలను పైనుండి తెప్పించి ఇండియాలో అతికించుట చేసిరి. 1940 వ సం॥ ఆఖరుసరికి రవాణా మోటారు ట్రక్కులు యీ రీతిగ కొన్నివందలు తయారవుతూ వచ్చాయి. సైన్యానికి యుద్ధప్రారంభంలో లభించిన మోటారు బండ్లకన్న ఆరు రెట్లు అధికంగా అందుచుండెను. అప్పటినుండి ఉత్పత్తి మరీ పెరిగింది.

సరియైన సంఖ్యలు చెప్పుట అనుచితము, కాని గత ఏడాదిలో ఇండియాలో ఉత్పత్తి అనేక రెట్లు అధికమయింది. ఒక ఉత్పత్తి స్థానంనుండి పై విధమున సమకూర్చబడిన మోటారు చేసీలుగల స్పెషలు రైలు కొద్దిరోజుల కొకటి చొప్పున పోతున్నది.

ఈలోగా ఇండియాలో ఉక్కు పరిశ్రమయందు అతి వడిగా పరిశోధనలు జరిపించి, అదివరకు తయారుచేయనటు వంటి ఉక్కు కవచం రేకు తయారుచేయుట ప్రారంభమయింది. 1940 వ సంవత్సరం ఆఖరు మాసాలలో బ్రిటనులో తయారయేటటువంటి కవచపు ఉక్కు రేకు ఇండియాలోగూడ తయారగుచుండెను. అందువలన ఉక్కు కవచం రక్షణగల ఆయుధ మోటారులను తయారుచేయుటకుగూడ వీలయ్యెను.

ఆయుధాలను మోసుకపోయే మోటారు బండ్లను తొలుదొల్త గత వత్సరం ప్రారంభములో తయారుచేయుట మొదలుపెట్టిన భారతదేశ రైల్వే కంపెనీల కర్మాగారాలు అతివడిగా చాల యెక్కువ తయారుచేయసాగినవి. ఔదార్యవంతులగు కొందరు పెద్దలు యీ పనికై చందాలుకూడ యిచ్చిరి. అనుభవంగడించిన కొద్దీ క్రొత్త రకములు తయారు చేయబడుచున్నవి. ఇపుడపుడే ఇండియాలో తయారైన సకవచ యుద్ధ మోటారులు విదేశాలకు పంపబడినవి.

## ఫిరంగులు-ఆయుధాలు.

రౌతు దళములకు మోటారు దళములకు యంత్రసాధనములు యెట్లు అవసరమో ఫిరంగి దళాలకుగూడ అట్లే అవసరం. ప్రభుత్వంవారి ఆర్డినెన్సు కర్మాగారాలలో నిర్ణయం ప్రకారము 7 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి యంత్రసామగ్రి అమర్చబడెను. బరువైన ఫిరంగులు తయారవుచున్నాయి. గత యేడు ఇండియాలో సరి క్రొత్త రకముల నేల ఫిరంగులు అత్యధికముగ తయారుచేయబడినవి. మన ఫ్యాక్టరీలలో తయారుచేయలేనటువంటి పెద్ద రకం ఫిరంగుల మరమ్మత్తులు చేయడానికి వీలగు యంత్రసామగ్రి అమర్చబడెను. ఎగుడుదిగుడు ప్రదేశములందు వడిగా యంత్రపుబళ్లచే యీడ్వబడుటకు ఫిరంగులనీడ్చే బండ్లు తయారుచేయబడుచున్నవి. బాంబులు, మందుగనులు, జలాంతర్గాములను ముంచే డెప్తు ఛార్జి (పీపావంటి గుండ్లు) ఇంజనీరింగు సామగ్రులు అనేక రకములు ఇండియాలో యెక్కువగ తయారవుతున్నాయి.

ఇంతవరకు విదేశాలకుపోయిన భారతీయ సేనలకు, వారికున్న యంత్రసామగ్రికి తోడుగ బ్రిటిషు సామ్రాజ్యం యంత్రసామగ్రి కొంత పంపవలసివస్తున్నది. యుద్ధ శిబిరాలకు చేరువగనే వారికి ఆధునిక యంత్రాలను వాడుటయందు ట్రెయినింగు ఒసంగబడుచున్నది. పరికరాలు ఆయుధసామగ్రి తక్కువగనున్నంతకాలం యీ పద్ధతే ఉపయుక్తమైనది, లాభకరమైనది కావచ్చును. కాని యిట్లాగే యెంతకాలమో యుండదు. ఇండియాలో యుద్ధ పరికరాల ఉత్పత్తి చాలపెరుగుచుండుటచేతను, తూర్పు దేశాలన్ని ఉత్పత్తిచేయుచుండుటచేతను, అమెరికానుండి విశేషంగా సరకువచ్చుచుండుటచేతను, అతిత్వరలో అక్షరాజ్యాల యుద్ధసామగ్రిని మన సామగ్రి మించిపోగలదు. త్వరలోనే ఇండియానుండి సైన్యాలు ఆధునిక యంత్రసామగ్రి అన్నిరకాలవాటితో విదేశ యుద్ధ రంగాలకు వెడలగలవు.

# భారత దేశంలో ఆయుధముల నిర్మాణం.

## అన్ని రకాలు ఇపుడు ఈ దేశంలోనే తయారగుతున్నాయి.

యుద్ధం ప్రారంభమయ్యే రోజులలో, ప్రభుత్వమువారు మందుగుండు ఫాక్టరీలను అధికమొనర్చుకొనే కార్యక్రమం లోవున్నారు. అంతకు పూర్వం ఈ దేశపు సైనిక సన్నాహపరిస్థితుల ప్రత్యేకంగా విచారణచేసిన చేటుఫీల్డు కమిటీవారు ఇందుకుగాను రూ 4 కోట్లు వెచ్చింపవలసినదని ప్రత్యేకంగా ఒక కార్యక్రమమును తయారుచేశారు. అది పూర్తి అయితే ఆయుధ సామగ్రి వుత్పత్తి నూటికి 20 వంతులు హెచ్చియుండేది. నేటి యుద్ధాలలో వుపయోగింపబడుచున్న కొత్త ఆయుధాలలో చాల భాగం ఈ దేశంలోనే తయారుచేసుకొనగల్గియుండే వారం. ఈ కార్యక్రమం 1941 వ సంవత్సరం ఆఖరుకు పూర్తి అయ్యేది. అందులో కొన్ని పనులు మాత్రం 1942 వ సంవత్సరంలో పని ప్రారంభించేవి. కాని యుద్ధం ప్రారంభంకాగానే, చాట్ఫీల్డు కమిటీవారు సూచించినవేగాక, మరి కొన్ని ఫాక్టరీలనుగూడ నిర్మించుటకు ఏర్పాటు జరిగింది. 1940 వ సంవత్సరంలో బ్రిటిషు ప్రభుత్వం వారీ దేశానికి పంపిన "సప్లై మిషను" వారు మరికొన్ని ఫాక్టరీలను నిర్మించవలెనని చెప్పారు. వీని అన్నిటి ఫలితంగా, రూ 50 లక్షల వెచ్చించి, ప్రభుత్వంవారిపుడు, ఇదివరకున్న ఫాక్టరీలను పెద్దవి చేయడమేగాక, చాల కొత్త ఫాక్టరీలనుగూడ నిర్మించారు. వీనికైన ఖర్చునంతను బ్రిటిషు ప్రభుత్వంవారే వహించారు. ఈ అభివృద్ధివలన శత్రువులు విషవాయువును ఉపయోగిస్తే దానిని తప్పించుకోడానికి "ఆంటీగాస్ రెస్పిరేటర్లు" విమానపు బాంబులు, ఫిరంగులు, గుండ్లు, మోర్టారు బాంబులు, చిన్న తరగతుల ఇతర ఆయుధములనుగూడ ఈ దేశములోనే తయారుచేయడానికి వీలైనది. కొన్ని ఫాక్టరీలలో, ఇదివరకు అనుకున్న దానికంటెకూడా చాల విస్తారమైన సామగ్రి వుత్పత్తి అగుతున్నది.

యుద్ధం రాగానే రైల్వేలకు అత్యవసరంగా కావలసిన సామగ్రిని తయారుచేసుకొన్న తరువాత రైల్వే ఫాక్టరీలు అన్నీ పూర్తిగా మందుగుండు ఆయుధసామగ్రినే తయారుచేయుటకు వినియోగింపబడుచున్నాయి.

రైల్వే కర్మాగారాలుగాక, ప్రజలకు సంబంధించిన షుమారు 250 లేక 300 కర్మాగారములుకూడ, ఆయుధ సామగ్రి వుత్పత్తికే పనిచేస్తున్నాయి షుమారు 700 రకాల పనిముట్లను తయారుచేయు పని ఈ ఫ్యాక్టరీలకు అప్పగింపబడెను.

అన్ని ఫ్యాక్టరీలు పూర్తిగానే పనిచేస్తున్నాయి. ఒకొక్క జట్టు 10 గంటల చొప్పున, రోజుకు రెండేసి జట్లుగాను, 8 గంటల చొప్పున మూడేసి జట్లుగాను కార్మికులు పనిచేస్తున్నారు. అన్ని ఫ్యాక్టరీలు వారానికి 6 రోజులు తీయకుండా పనిచేస్తున్నాయి. కొన్ని 7 రోజులుగూడా పనిచేస్తున్నాయి. అయితే ఇంతపనికి కావలసిన సుశిక్షితులగు కార్మికులు యెక్కడ దొరకెదరాయనేది పెద్ద ప్రశ్నగావుంది. అయితే సప్లయి శాఖవార్లు, లేబరు శాఖవారు, వేర్వేరు ఫ్యాక్టరీలలో అనేక వేలమంది సుశిక్షితులగు కార్మికులను తయారుచేయుటకు ఏర్పాటులు చేశారు. ఇందుకు 24½ లక్షలను వెచ్చించుటకుగూడ బ్రిటిషు ప్రభుత్వంవారామోదించిరి. ఈ పనిచాలా చురుకుగా జరుగుచున్నది.

పై ప్రయత్నాలవలన, ఇదివరకుకంటె, ఆయుధ సామగ్రి వుత్పత్తి యెంతవరకు హెచ్చినదో వెల్లడించుటకు వీలులేదు. కాని చూచాయగామాత్రం కొంతవరకు వెల్లడిస్తే ప్రమాదంలేదు. 1941 వ సంవత్సరపు మధ్యన, ఈ దేశంలో సంగ్రామము పూర్వము సాలీనా తయారగుచున్న ఫిరంగుల కంటె అయిదు రెట్లు తయారగుచున్నాయి. ఫిరంగి గుండ్ల వుత్పత్తి 24 రెట్లు హెచ్చింది. దీనిని 69 రెట్లకు హెచ్చించుటకు ఏర్పాటు చేశారు. 1941 వ సంవత్సరము జూనుసరికి, ఈ దేశానికి కావలసిన వానిని సప్లై చేసుకొనుటయేగాక 6 లక్షల ఫిరంగి గుండ్లను, 15 కోట్ల తుపాకి గుండ్లను ఇతర యుద్ధరంగాలకు సప్లైచేశారు.

ప్రస్తుతం ఈ ఫ్యాక్టరీలలో వేర్వేరురకాల మందు గుండ్లు, తుపాకి మందు, శత్రులపై చేతితో విసరే బాంబులు, ఫిరంగులు, ఫిరంగులను అమర్చే చట్రాలు, తుపాకులు, సన్నీలు, తేలిక రకపు మరఫిరంగులు తయారగుతున్నాయి. కొత్త ఫ్యాక్టరీలు పూర్తి అయ్యేసరికి, అన్ని రకముల ఫిరంగి గుండ్లు, మందుగుండు సామానులే కాకుండా, కొత్తరకపు బాంబులు, టాంకులను భేదించి ధ్వంసంచేసే ఫిరంగులుగూడా ఈ దేశంలోనే తయారగుతూవుంటాయి.

మేలు రకపు, ఆధునిక ప్రేలుడు ఆయుధ పరికరములను ఉత్పత్తి చేసుకోడంలో, దేశం అపుడే స్వయం సమృద్ధమగుచున్నది.

ఈ దేశంలోనే విమానాలను తయారుచేయడంకోసం 1940 వ సంవత్సరములో ఒక విమాన నిర్మాణశాలను గూడ స్థాపించారు. ప్రభుత్వంవారీ పరిశ్రమకు కొంత సొమ్ము పెట్టుబడి చేయుటయేగాక, పలురకముల విమానాలను నిర్మించి సప్లై చేయవలసినదని "ఆర్డరు" కూడా యిచ్చారు. ప్రస్తుతం, ఇచట, రెండు రకముల యుద్ధ విమానాలు తయారగుతున్నాయి. దీని కవసరమైన పరికరములు అమెరికా మొదలగు విదేశాలనుండి దిగుమతి అగుచున్నవి. కాని క్రమేణా వాని నన్నింటిని ఈ దేశంలోనే తయారుచేయడానికి అన్ని యేర్పాటులు జరుగుచున్నాయి.

అనేక రకముల చిన్న రకముల స్టీమరులనుగూడ, ఈ దేశంలోనే తయారుచేయించుటకు 1940 వ సంవత్సరమునుంచి ప్రభుత్వంవారు ప్రారంభించిరి. అందుకవసరమగు సౌకర్యాలు ఇదివరకే, ఈ దేశంలో కొన్ని చోట్ల వున్నాయి. అందు కవసరమగు వుక్కులో చాలా భాగం ఈ దేశంలోనే తయారగుచున్నది. కాని, ఇంజనులను, బాయిలర్లను తయారుచేయడానికి మాత్రం తగిన ఏర్పాటులులేవు. అటువంటి భాగాలను, ఇంగ్లండు మొదలగు దేశాలనుండి దిగుమతిచేసుకొని, ఇచ్చట తయారైన నౌకలకు అమర్చుకుంటున్నారు. పెద్దపెద్ద నౌకలకుగూడా మరమ్మతులు చేయడానికి అవసరమగు "ఫ్లోటింగు డాక్సు"ను గూడ, ఇటీవల నీదేశంలోనే నిర్మించియిచ్చారు.

యుద్ధానికి పూర్వం ఇనుప కవచములుగల ఆయుధ శకటములు, టాంకులు మొదలైనవి పూర్తిగా ఇంగ్లండు నుంచి దిగుమతియగుచుండేవి. ఇపుడు టాటా కంపెనీవారు పరిశోధనల కాపించి మేలురకపు వుక్కును తయారుచేయడం ప్రారంభించిన తరువాత టాంకులు, సకవచశతఘ్నులు మొదలగు వానినిగూడ ఈ దేశంలో తయారుచేస్తున్నారు.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.